ఓమ్

# ఋగ్వేద భావార్థము

(ఋగ్వేద భాష్యము నుండి)

**11-20 సూక్తములు**



భాష్యకర్త

మహర్షి స్వామి దయానంద సరస్వతి

---

అనువాదకుడు

అన్నె కేశవార్యశాస్త్రి

దయానందాబ్దము 145 — శా. శ. 1891

ప్రథమ ముద్రణము 700 — వెల : 0.50 పై.

# వి జ్ఞా ప న ము

మహర్షి రచిత యజుర్వేద భాష్యమును అనువదించి ప్రకటించిన తర్వాత ఋగ్వేద భాష్యమునకు కూడ అనువాద మొనర్చవలయునని తోచెను వయసు మీ టచే నాటి శక్తి స్తోమతలు నేడు లేవు. కనుక ఆరంభములో 10 సూక్తములు యధాతథముగ ప్రకాశన మొనర్చి యుంటిని. ఈ ప్రకాశనములో సాధక బాధకములన్ని నాయొక్కని మీదనే పడినను వదలిపెట్ట జాలకయు నూరుకొనజాలకయు నీ పర్యాయము కేవలము ఆయా మంత్రములకు నిర్దేశించిన విషయములతో సహా భావార్థ ములను వేదధర్మము 6. 7,8 సంచికలలో ప్రకటించితిని. వానినే పుస్తక రూపములో సమీకరించితిని. ఇందు కొన్నిటికి సంస్కృత భావార్థమును గూడ ఉదహరించితిని.

వేదాభిమానులైన పాఠకులు అచిరకాలములో ఋగ్వేద భావార్థములనైనను ఆంధ్రులకందించ గలుగు సౌభాగ్యము నాకు సమకూర్చుటకు తగినటుల ప్రోత్సహించగలరని ఆశించు చున్నాను.

సౌమ్య శ్రావణ పూర్ణిమ

హైద్రాబాదు.

ఇట్లు

అన్నే కేశవార్యశాస్త్రి

---

[41వ పేజీ తరువాయి]

ఈ యనువాదమునందు మంత్రమునకు ముందు నిర్దేశించిన విషయ సూచిక వాక్యమును, భావార్థమును రెంటిని జోడించి ప్రకటించితిమి. ఇటుల అద్యంతములందుదహరించిన వారి మంత్రభాష్యములను మనన మొనర్చిన పాఠకులకు ప్రతి పదార్థము చూడ కుతూహల ముద్భవించగలదని అట్టివారి దోహదముచే మహర్షి ఋగ్వేద భాష్యము పూర్తి రూపములో ప్రకటించబడగలదని ఆశించుచున్నాను.

ఓమ్

# ఋగ్వేద భాష్య భావార్థ ప్రకాశిక

## మహర్షి దయానంద సరస్వతీ కృతము

### ప్రథమ మండలము నందలి ౧౧వ సూక్తము

ఈ యేకాదశ సూక్తమందెనిమిది ఋక్కులున్నవి.

జేతా మాధుచ్ఛన్దసుడు ఋషి. ఇంద్రుడు దేవత.

అనుష్టుప్పు ఛందస్సు. గాంధార స్వరము.

ఇంద్ర శబ్దముచే నీశ్వరుడు విజేత యిరువురు ఉపదేశించబడుచున్నారు.

౧. ఈ మంత్రమందు శ్లేషాలంకారమున్నది. సమస్త వేద వాణులు, పరమైశ్వర్యయుక్తుడు, సర్వాంతర్యామి, సర్వగతుడు, సర్వత్ర రమమాణుడు, సత్యస్వభావము గలవాడు, ధార్మికులైన సజ్జనులకు విజయము కలిగించువాడునగు పరమేశ్వరుని ప్రకాశపఱచుచున్నవి.(అటులనే) ధర్మముచేతను, బలముచేతను దుష్ట మానవులను జయించువాడును, ధార్మికులను రక్షించువాడును నగు మానవునిగూడ (ప్రకాశింప జేయుచున్నవి). ఇటుల పరమాత్మ వేదవాక్కుచే మానవులందరకు తెలియపఱచుచున్నాడు.

---

౧. అత్ర శ్లేషాలంకారః. సర్వా వేదవాణ్యః పరమైశ్వర్యవంతం సర్వగతం సర్వత్ర రమమాణం సత్యస్వభావం ధార్మికాణాం విజయప్రదం పరమేశ్వరం ప్రకాశయంతి. ధర్మేణ బలేన దుష్టమనుష్యాణాం విజేతారం ధార్మికాణాం పాలకం వేతీశ్వరో వేదవచసా సర్వాన్ విజ్ఞాపయతి.

౨. మఱల నద్దానినే ప్రకాశింపజేయుచున్నాడు.

౨. శ్లేషాలంకార మిందున్నది. ఏ మానవులు పరాత్పరుని యాజ్ఞలను పాలించుటయందును, అటులనే శూరవీరులందును మిత్రభావమును ప్రీతిని ప్రదర్శించెదరో వారు బలశాలురై ఎట్టి శత్రువులనుండియైనా భయ పరాజయముల నెన్నటికి పొందజాలరు.

౩. మఱల వారిరువురే వర్ణింపబడుచున్నారు.

౩. శ్లేషాలంకార మిచ్చట నున్నది. జగత్తునందెటుల ఈశ్వరుని దానరక్షణలు నిత్యములు, న్యాయయుక్తములునైన కర్మలగుచున్నవో అటులనే మానవులును ప్రజలందు విద్యను నిర్భయత్వమును నిరంతరము విస్తరింపజేయవలయును. ఈశ్వరుడు లేనిచో నీ జగత్తెటుల ఉత్పన్నమయ్యెడిది ? ఈశ్వరుడు సకలము నుత్పన్నమొనర్చి మానవులకీయనిచో మానవులెటుల జీవించగలరు ? కనుక సకలకార్య (పదార్థ)ముల నుత్పన్నమొనర్చువాడు, సర్వసుఖముల నిచ్చువాడు ఈశ్వరుడై యున్నాడు. అన్యుడెవడును లేడని యందరు స్వీకరించవలయును.

---

౨. అత్ర శ్లేషాలంకారః. యే మనుష్యా పరమేశ్వరే తదాజ్ఞాచరణే తథా శూరాది మనుష్యేషు నిత్యం మిత్రతా మాచరంతి, తే బలవంతో భూత్వా నైవ శత్రుభ్యో భయ పరాభవౌ ప్రాప్నువంతీతి.

3. అత్రాపి శ్లేషాలంకారః. యథేశ్వరస్య జగతి దాన రక్షణాని నిత్యాని న్యాయయుక్తాని కర్మాణి సంతి, తథైవ మనుష్యైరపి ప్రజాయాం విద్యాఽభయదానాని నిత్యం కార్యాణి. యదీశ్వరో న స్యాత్తర్హీదం జగత్ కథ ముత్పద్యేత? యదీశ్వరః సర్వముత్పాద్య న దద్యాత్తర్హి మనుష్యాః కథం జీవేయుస్తస్మాత్ సకలకార్యోత్పాదకః సర్వ సుఖదాతేశ్వరోఽస్తి, నేతర ఇతి మంతవ్యమ్.

౪. మరల ఇంద్ర శబ్దముచే సూర్యునియొక్కయు, సేనాపతి యొక్కయు గుణము లుపదేశించబడుచున్నవి.

౪. శ్లేషాలంకార మీ మంత్రమందున్నది. ఈశ్వరునిచే సృజింపబడి ధరించబడిన యీ సూర్యలోకము వజ్రతుల్యములు ఛేదకములు నగు స్వకీయ కిరణములచే నఖిలమూర్తి వత్పదార్థములను భేదించునవి, బహు గుణములకు హేతువు, ఆకర్షణ గుణముచే పృథివ్యాది లోకములను ధారణ మొనర్చునదియునునై యెటులున్నదో అటులనే సేనాపతియు స్వబలముచే శత్రుబలమును ఛేదించి, సామ దాన దండాదులచే దుష్టమానవులను వేరు పఱచి భూమియందు స్వకీయ రాజ్యమును సతతము పాలించవలయును.

౫. మఱల నాతని గుణము లుపదేశించబడుచున్నవి.

౫. సూర్యుడెటుల తన కిరణములచే ఘనీభూతమైయున్న మేఘమును ఛేదించి భూమిపై పడవేయుచు వర్షమును గురిపించుచున్నాడో ఏల యన ఆ మేఘమతని కిరణములలోనే స్థితమైయున్నది. ఎవని చుట్టూ ఆకర్షణముచే పృథివ్యాది లోకములు స్వకీయ కక్షలందుత్తమ నియమముచే భ్రమించుచున్నవో దానివలన నెటుల అయన—ఋతు—మాస—పక్ష—అహోరాత్ర— ఘటిక— పలాదికాల విభాగములు జరుగుచున్నవో అటులనే గుణవంతుడైన సేనాపతియు నుండవలయును.

---

౪. అత్ర శ్లేషాలంకారః యథేశ్వరేణ సృష్ట్వా ధారితోఽయం లోకః స్వకీయై ర్వజ్రభూతైశ్ఛేదకైః కిరణైః సర్వేషాం మూర్త ద్రవ్యాణాం భేత్తా బహుగుణ హేతుకాకర్షణేన పృథివ్యాదిలోకస్య ధాతాఽస్తి, తథైవ సేనాపతినా స్వబలేన శత్రుబలం ఛిత్వా సామదానాదిభి ర్దుష్టా న్మనుష్యా న్భిత్వాఽనేక శుభగుణాకర్షకో భూత్వా భూమౌ స్వ రాజ్య పాలనం సతతం కార్య మితి వేద్యమ్.

౫. యథా సూర్యః స్వకిరణై ర్ఘనాకారం మేఘం ఛిత్వా భూమౌ నిపాతయతి, యస్య కిరణేషు మేఘస్తిష్ఠతి, యస్యాభిత ఆకర్షణేన పృథి

౬. ఇంద్ర శబ్దముచే శూరవీరుల గుణములు చెప్పబడుచున్నవి.

౬ ఈ మంత్రమందు లుప్తోపమాలంకార మున్నది. ఈశ్వరుడు సకల మానవుల నాదేశించుచున్నాడు:— ధార్మికుడు శూరుడు, ప్రశంసనీయుడు నగు సభాధ్యక్షుని లేక సేనాధ్యక్షుని అభయదానముచే, సముద్రములోని జంతువులవలె నాశ్రయముచేతను మానవులందరు రాజ్యకార్యములను చక్కగా నెఱిగి పూర్తిగ సాధించవలయును. దుఃఖముల నివారించి సుఖములకై పరస్పరము విచారించవలయును.

౭. ఈ మంత్రమందు సూర్యగుణముల నుపదేశించెను.

౭. బుద్ధివంతులగు మానవుల కీశ్వరుడిటుల ఆజ్ఞాపించుచున్నాడు. సామదాన దండభేదాద్యుపాయములచే దుష్టశత్రువులను నివారించి విద్యను చక్రవర్తి రాజ్యమును అభివృద్ధి పఱచవలయును. ఈ జగత్తులో దుష్టులు, కపటులు అభివృద్ధి జెందకుండునటుల నిత్యము ప్రయత్నమొనర్చుచుండవలయును.

---

వ్యాదయో లోకాః స్వస్వకక్షాయాం సునియమేన భ్రమంతి, తతో ఽయనర్త్వహోరాత్రాదయో జాయంతే, తథైవ సేనాపతినా భవితవ్య మితి.

౬. అత్ర లుప్తోపమాలంకారోఽస్తి.ఈశ్వరః సర్వానాజ్ఞాపయతి:— మనుష్యైర్ధార్మికస్య శూరస్య ప్రశంసితస్య సభాధ్యక్షస్య వా, సేనాధ్యక్షస్య మనుష్యస్యాభయదానేన సముద్రస్య జంతవ ఇవాశ్రయేణ రాజ్యకార్యాణి సమ్యగ్ విదిత్వా సంసాధనీయాని దుఃఖనివారణేన సుఖాయ పరస్పరముపస్థితిశ్చ కార్యేతి.

౭. ఈశ్వర ఆజ్ఞాపయతి:— మేధావిభిర్మనుష్యైః సామదాన దండయుక్త్యా దుష్టశత్రూన్నివార్య విద్యాచక్రవర్తిరాజ్యస్య విస్తారః సంభావనీయః. యథాఽస్మిన్ జగతి కపటినో మనుష్యా న వర్ధేరంస్తథా నిత్యం ప్రయత్నః కార్య ఇతి.

ర. ఈశ్వరుని గుణము లీ మంత్రమందుపదేశించబడుచున్నవి.

ర. దయాలువైన యే పరమాత్మ ప్రాణుల సుఖమునకై జగత్తు నందనేక శ్రేష్ఠ పదార్థములను స్వకీయమైన ఓజస్సుచే నిర్మించి. జీవులకు ప్రధానమొనర్చెనో, ఏ బ్రహ్మకు ఈ సకల ధన్యవాదములు చెల్లునో, అతని యాశ్రయము నే సకల మానవులు పొందవలయును.

ఈ ఏకాదశ సూక్తము నందు ఇంద్ర శబ్దముచే నీశ్వరుని స్తుతి, నిర్భయత్వ సంపాదనము. సూర్యమండలము యొక్క కార్యము శూర వీరుల గుణవర్ణనము, దుష్టశత్రు నివారణము, ప్రజల రక్షణ, ఈశ్వరుని యనంత సామర్థ్యముచే జగదుత్పత్తి విధానము చెప్పబడియుండుటచే నీ పదునొకండవ సూక్తార్థమునకు పదియవ సూక్తముతో సంగతి గల దని గ్రహించవలయును.

ఈ సూక్తముకూడ సాయణాచార్యాద్యార్యావర్తీయుల చేతను, యూరోపీయులైన విల్సను మొ॥వారి చేతను విపరీతముగ వ్యాఖ్యానించ బడినది.

---

ర. యేన దయాలునేశ్వరేణ ప్రాణినాం సుఖాయానేకే పదార్థా జగతి స్వౌజసోత్పాద్య దత్తా, యస్య బ్రహ్మణః సర్వ ఇమే ధన్యవాదా భవంతి, తస్యైవాశ్రయో మనుష్యైర్గ్రాహ్య ఇతి.

అత్రైకాదశసూక్తే హీంద్ర శబ్దేనేశ్వరస్య స్తుతి ర్నిర్భయ సంపాదనం సూర్యలోకకృత్యం శూరవీరగుణ వర్ణనం దుష్ట శత్రునివారణం, ప్రజారక్షణ మీశ్వర స్యానంత సామర్థ్యా జ్జగదుత్పాదనాదివిధాన ముక్త మతోఽస్య దశమ సూక్తార్థేన సహ సంగతి రస్తీతి బోధ్యమ్.

ఇద మపి సూక్తం సాయణాచార్యాదిభి ర్యూరోపదేశనివాసి భి ర్విలసనాదిభి శ్చాన్యథైవ వ్యాఖ్యాతమ్.

ఇతి ప్రథమ మండలే తృతీయోఽనువాక ఏకాదశ సూక్త మేక వింశో వర్గశ్చ సమాప్తః.

# ౧౨వ సూక్తము

అథ ద్వాదశర్చస్య ద్వాదశ సూక్తస్య

కాణ్వో మేధాతిథి ఋషిః, అగ్నిర్దేవతా.

గాయత్రీ ఛందః షడ్జః, స్వరః

ప్రథమ మంత్రమున భౌతికాగ్ని గుణము లుపదేశించబడుచున్నవి.

౧: ఈశ్వరుడు మానవులందరికి ఆజ్ఞాపించుచున్నాడు:—విద్వాంసులు ప్రత్యక్షా ప్రత్యక్షముగ నెద్దాని గుణములను ప్రసిద్ధిపఱచిరో, ప్రసిద్ధాప్రసిద్ధగుణ ద్రవ్యములను మీదికి క్రిందికి చేర్చుట వలన దేనికి దూత స్వభావము కలిగినదో, శిల్పవిద్యచే సంభావిత కలాయంత్రాదుల ప్రేరణకు నేది హేతువో, విమానాదియానములందు వేగాది క్రియలకు నేదినిమిత్తమో అట్టి భౌతికాగ్నిని విద్యచే సకల సజ్జనుల ఉపకారమొనర్చుటకును, సమస్త శ్రేష్ఠ సుఖములు సంభవించునటులను మానవులు నిరంతరము చక్కగా చేపట్టవలయును.

౨ ద్వివిధమైన అగ్ని యీ మంత్రమందుపదేశింపబడు చున్నది.

---

౧. ఈశ్వర ఆజ్ఞాపయతి—మనుష్యైరయం ప్రత్యక్షా ప్రత్యక్షేణ ప్రసిద్ధా ప్రసిద్ధగుణ ద్రవ్యాణా ముపర్యధో గమకత్వేన దూతస్వభావః శిల్పవిద్యా సంభావిత కలాయంత్రాణాం ప్రేరణహేతు ర్యానేషు వేగాది క్రియానిమిత్త మగ్నిః సమ్యగ్ విద్యయా సర్వోపకారాయ సంగ్రాహ్యో యతః సర్వాణ్యుత్తమాని సుఖాని సంభవేయు రితి.

౨. అత్ర లుప్తోపమాలంకారః పూర్వస్మా న్మంత్రాద్ 'వృణీమహే' ఇతి పదమనువర్తతే. ఈశ్వరః సర్వాన్ప్రత్యు పదిశతి. హే మనుష్యాః యుష్మాభి ర్విద్యుదాఖ్యస్య ప్రసిద్ధ స్యాగ్నేశ్చ సకాశా త్కలా

౨. లుప్తోపమాలంకారమిందున్నది. మొదటి మంత్రమునుండి 'వృణీ మహే' అను పదము అనువృత్తి యగుచున్నది. ఈశ్వరుడు సకల మానవుల కుపదేశించుచున్నాడు — మానవులారా! మీరందరు విద్యుదగ్ని చేతను భౌతికాగ్నిచేతను కళా కౌశలాదులను సాధించి యభీష్ట సుఖములను నిరంతరము భోగించవలయును. భోగింపజేయవలయును.

ఈ మంత్రమందగ్ని శబ్దముచే నీశ్వర భౌతికాగ్నులు ఉపదేశించబడుచున్నవి.

౩. శ్లేషాలంకార మిందున్నది. మానవుల ద్వారా ప్రాదుర్భూతమైన యే ప్రత్యక్షాగ్నియందు సుగంధ్యాదిగుణయుక్త ద్రవ్యముల హోమమొనర్చబడుచున్నదో ఆయా ద్రవ్యములతో గూడినదై యయ్యది యాకాశమున వాయువును మేఘమండలమును శుద్ధియొనర్చి యీ లోకమున దివ్య సుఖములను కలిగించుచున్నది. కనుక నీ యగ్ని నిత్యమన్వేషించదగిన గుణములు గలదై యున్నదను పరమేశ్వరాజ్ఞను మనము మన్నించవలసి యున్నది.

౪. భౌతికాగ్ని గుణములు వర్ణించబడుచున్నవి

---

కౌశలాది సిద్ధిం కృత్వాఽభీష్టాని సుఖాని సదైవ భోక్తవ్యాని భోజయితవ్యాని చేతి.

౩. అత్ర శ్లేషాలంకారః. మనుష్యై ర్యస్మిన్ ప్రాదుర్భూతేఽగ్నౌ సుగంధ్యాది గుణయుక్తానాం ద్రవ్యాణాం హోమః క్రియతే, స తద్ద్రవ్య సహిత ఆకాశే వాయుం మేఘమండలం చ, శుద్ధ్వేహాఽస్మిన్ సంసారే దివ్యాని సుఖాని జనయతి, తస్మా దయమస్మాభి ర్నిత్య మన్వేష్టవ్య గుణోఽస్తీతీశ్వరాజ్ఞా మంతవ్యా.

౪. జగదీశ్వర ఆజ్ఞాపయతి :— అయ మగ్ని ర్యుష్మాకం దూతోఽస్తి. కుతః, హుతాన్ దివ్యాన్ పరమాణు రూపాన్ పదార్థా నంతరిక్షే గమయతీత్యతః. ఉత్తమానాం భోగానాం ప్రాపకత్వాత్. తస్మా

౪. పరమేశ్వర డాజ్ఞాపించుచున్నాడు. మానవులారా! ఈయగ్ని మీ దూత. ఎందుకనగా హవనమొనర్చబడుటచే పరమాణు రూపములోనున్న దివ్యపదార్థములను అంతరిక్షమునకు చేర్చుచున్నది కావున ఉత్తమోత్తమ భోగముల ప్రాప్తికి హేతువై యున్నది. కావున సకల మానవులు ప్రసిద్ధాగ్నియొక్క ప్రసిద్ధ గుణములు సమస్త కార్యముల సిద్ధికొఱకవశ్యము. ప్రకాశింపజేయవలయును.

౫. అగ్ని ఏమిచేయున దిందుపదేశింపబడుచున్నది.

౫ ఈవిధముగ సుగంధ్యాది గుణములుగల ద్రవ్యయుక్తమైన ఈయగ్ని సమస్త దుర్గంధాది దోషములను నివారించి యందఱికి సుఖదాయకమగుచున్నది. (కావున దానిని చక్కగా నుపయోగించవలయును.) అని ఈశ్వరుడు చెప్పెను. (మానవులందరు దీనిని స్వీకరించుట ఉచితము.)

౬ అది యెట్టిది? ఎటుల ప్రదీప్తమగునో చెప్పబడుచున్నది.

౬. ఏ యీ సకల పదార్థములతో గూడిన యగ్ని కలదో యది విద్యదగ్ని యనబడుచున్నది. దానిచేతనే ప్రత్యక్షములైన సూర్యాగ్ని

---

త్సర్వైర్మనుష్యైః ప్రసిద్ధస్యాగ్నే ర్గుణాః కార్యార్థం నిత్యం ప్రకాశనీయా ఇతి.

౫ ఏవం సుగన్ధ్యాది గుణయుక్తేన ద్రవ్యేణ సంయుక్తోఽయ మగ్నిః సర్వాన్ దుర్గాంధాది దోషాన్ నివార్య సర్వేభ్యః సుఖకారీ భవతీతీశ్వర ఆహ.

౬. యోఽయం సర్వపదార్థమిశ్రో విద్యుదాఖ్యోఽగ్నిరస్తి తేనైవ ప్రసిద్ధౌ సూర్యాగ్నీ ప్రకాశ్యేతే. పున రదృష్టౌ సంతౌ తద్రూపావేవ భవతః మనుష్యైర్యద్యనయోర్గుణ విద్యాః సమ్యగ్గృహీత్వోపకారః క్రియేత తర్హ్యనేకే వ్యవహారాః సిధ్యేయుస్తైరసంఖ్యాతానంద ప్రాప్తిః సర్వేభ్యో నిత్యం భవతీత్యాహ జగదీశ్వరః.

—: ఇతి ద్వాదశ వర్గో సమాప్తః :—

భౌతికాగ్ని రెండు ప్రకాశితములగుచున్నవి. అవి మరల యదృష్టములై విద్యుద్రూపమునే పొందుచున్నవి. మానవులీ రెంటియొక్క గుణములను విద్యను చక్కగా గ్రహించి యుపకార మొనర్చుచో వానివలన ననేక పద్ధప హారములు సిద్ధించుటచే ననంఖ్యాతానంద ప్రాప్తి యందలును నిత్యము లభించగలదని జగదీశ్వరుని వచనమై యున్నది.

౭. అగ్ని శబ్దముచే నీశ్వర భౌతికాగ్ను లుపదేశింపబడుచున్నవి.

౭. ఈ మంత్రమందు శ్లేషాలంకార మున్నది. మానవులు సత్య విద్యచే ధర్మప్రాప్తి కొఱకు, శిల్ప విద్యా సిద్ధి కొఱకు. ఈశ్వరుని, భౌతి కాగ్నిని తత్తద్ గుణములను వేరువేరుగ ప్రకాశిత మొనర్చవలయును. దానివలన రోగాదుల వినాశనముచే ప్రాణులన్నిటికి సకల గుణములు ఉప గతములు కాగలవు.

౮. ఈశ్వర భౌతికాగ్ను లుపదేశింప బడుచున్నవి.

౮. శ్లేషాలంకార మిందున్నది. దూత శబ్దము నకు మానవులకు జ్ఞాన ప్రాపకత్వముచే నీశ్వరుని యందును. దేశాంతరమునకు ప్రాపక ముసు చేర్చుటచే భౌతికాగ్నియందును ఉభయత్ర సార్థకమగుచున్నది. ఏ మానవులు ఆస్తికులై హృదయమునందు సర్వసాక్షియగు పరమాత్మను

---

౭. అత్ర శ్లేషాలంకారః. మనుష్యైః సత్య విద్యయా ధర్మ ప్రాప్తయే సత్యశిల్పవిద్యాసిద్ధయే చాగ్ని రీశ్వరో భౌతికో వా తత్ గుణైః ప్రకాశయితవ్యో యతః ప్రాణినాంరోగ నివారణేన సుఖాన్యుపగతానిస్యుః.

౮. అత్ర శ్లేషాలంకారః. దూత శబ్దేన జ్ఞానప్రాపకత్వ మీశ్వరే. దేశాంతరే ద్రవ్యయాన ప్రాపణం చ భౌతికే మత్వాఽస్య ప్రయోగః కృతోఽస్తి. యే మనుష్యా ఆస్తికా భూత్వా హృదయే సర్వసాక్షిణం పర మేశ్వరం ధ్యాయంతి త ఏవేశ్వరేణ రక్షితాః పాపాని త్యక్త్వా ధర్మా త్మనః సంతః సుఖం ప్రాప్నువంతి. యేయుక్త్యా యానయంత్రాది ష్వగ్నిం ప్రయుంజతే తేఽపి యుద్ధాదిషు కార్యేషు రక్షితా రక్షకాశ్చ భవంతీతి.

ధ్యానించెదరో వారే ఈశ్వరుని ద్వారా రక్షితులై పాపములను త్యజించి ధర్మాత్ములై యత్యంత సుఖమును పొందగలుగుచున్నారు.

ఏ మానవులు ఉపాయముగ వాహన యంత్రాదులందు భౌతికాగ్నిని పొందుపఱచెదరో వారును యుద్ధాది కార్యములందు రక్షితులై పరులను గూడ రక్షించువారగుచున్నారు.

౯. మరల ఉక్తార్థములే ప్రకాశింపబడుచున్నవి.

౯. శ్లేషాలంకార మిందున్నది. ఏ మానవులు సత్యభావము చేతను, కర్మచేతను, విజ్ఞానము చేతను దేవాధిదేవుని సేవించెదరో, వారు దివ్యగుణములను (పొంది) పవిత్ర కర్మలొనరించి యుత్తమ సుఖములను పొందుచున్నారు. దివ్యగుణములు గల యగ్ని నెందులకు రచించబడెనో అందులకే దానినుండి మానవులు దివ్యములైన ఉపకారములను పొందవలయును. ఇది యీశ్వరోపదేశము.

౧౦. ఈ యిద్దరీ మంత్రముచే మరల పేర్కొనబడుచున్నారు.

౧౦. శ్లేషాలంకార మిందున్నది. ఏ ప్రాణికైనా యేదైనా పదార్థ

---

౯. అత్ర శ్లేషాలంకారః యే మనుష్యాః సత్యేన భావేన కర్మణా విజ్ఞానేన చ పరమేశ్వరం సేవంతే, తే దివ్యగుణాన్ పవిత్రాణి కృత్వా సుఖాని చ ప్రాప్నువంతి, యేనాయం దివ్యగుణ ప్రకాశకోఽగ్ని రచిత స్తస్మాన్మనుష్యై ర్దివ్యా ఉపకారా గ్రాహ్యా ఇతీశ్వరోపదేశః.

౧౦. అత్ర శ్లేషాలంకారః. యస్య ప్రాణినః కస్యచిత్ పదార్థ స్య ప్రాప్తీచ్ఛా జాయతే. తత్సిద్ధయే పరమేశ్వరః ప్రార్థ్యతే పురుషార్థశ్చ క్రియతే. యాదృశా అస్మిన్వేదే జగదీశ్వరస్య గుణ స్వభావా అన్యేషాం చ ప్రతిపాదితా దృశ్యంతే మనుష్యైస్త దనుకూల కర్మానుష్ఠానేనాగ్న్యాది. పదార్థగుణాన్ విదిత్వాఽనేక విధా వ్యవహార సిద్ధిః కార్యేతి.

మును పొందుట కభిలాషకలుగుచో తత్సిద్ధికై పరమేశ్వరుడు ప్రార్థించ బడవలెను, పురషార్థము నొనర్చవలయును. ఎటుల ఈ వేదమునందు పర మేశ్వరుని గుణకర్మ స్వభావములు, ఇతర ద్రవ్యముల గుణకర్మ స్వభావ ములు ప్రతిపాదించబడి కనబడుచున్నవో అటులనే మానవులును వానికను కూలములైన కర్మల ననుష్ఠించి యగ్న్యాదిప దార్థముల గుణముల నెఱిగి యనేక విధముల వ్యవహారములను సాధించవలయును.

౧౧. మరల నా రెండు నుపదేశింపబడుచున్నవి.

౧౧. ఈ మంత్రమందు శ్లేషాలంకారమున్నది. పూర్వ మంత్రము నుండి చకారము అనువృత్తి. ప్రతి మానవుడు వేదాదుల యధ్యయనము నూతన నూతనముగ నొనర్చుటచే దానివలన కలుగు నుచ్చారణక్రియ ప్రవర్తిల్లును. కనుక మంత్రమందు 'నవీయసా' అను పదము పడి యున్నది.

ఏ ధర్మాత్ములైన మానవులు యథావతుగ శబ్దార్థ సంబంధ పుర స్సరముగ వేదాధ్యయన మొనర్చియు, తదుక్త కర్మల ననుష్ఠించియు జగదీశ్వరుని ప్రసన్న మొనర్చుచున్నారో వారికి విద్యాద్యుత్తమ ధనములను శూరత్వాది శ్రేష్ఠ గుణములను ఉత్తమ వాంఛలను కలిగించుచున్నాడు. (ఏలయన పరాత్పరుని సేవలవలనను, వేదాధ్యయనము వలనను మానవు లనేక సుఖములను ప్రకాశపఱచగలుగుదురు.)

---

౧౧. అత్ర శ్లేషాలంకారః. పూర్వస్మా న్మంత్రాచ్చకారోను౽వృ ష్యతే. తథా ప్రతిజనం నవీనం నవీనం వేదాధ్యయనం తజ్జన్యోచ్చారణ క్రియా చ ప్రవర్తతే తస్మాన్నవీయ సేత్యుక్తమ్. యై ర్ధర్మాత్మభి ర్మనుష్యై ర్యథావ చ్ఛబ్దార్థ సంబంధ పురఃసరేణ వేదస్యాధ్యయనేన తదుక్త కర్మణా చ ప్రీతః సంపాదితో జగదీశ్వర ఉత్తమాని విద్యాది. ధనాని శూరత్వాది గుణాన్ సతీమిచ్ఛాం చ దదాతి.

౧౨. ఈ మంత్రమందును వారి గుణములే ఉపదేశించబడు చున్నవి.

౧౨. ఈ మంత్రమందు శ్లేషాలంకారమున్నది. దివ్యవిద్యలను ప్రకాశపఱచి యుండుటచే దేవశబ్దమువలన వేదములు గ్రహించబడు చున్నవి. మానవులెన్నడు సత్యభావముతో (ప్రేమతో) వేదవాణి ద్వారా జగదీశ్వరుని స్తుతించెదరో అప్పుడా పరమాత్మ ప్రీతుడై ఆ మానవులకు విద్యాదానమొసగి ప్రసన్నులుగ నొనర్చును. అటులనే యీ భౌతికాగ్నియు విద్యచేత సంప్రయోగించబడినదై ఇంధనాదులందు స్థితమై నిఖిల క్రియా కాండమును జరిపించును.

ఈ ద్వాదశ సూక్తార్థము అగ్న్యర్థయోజన యగుటచే నేకాదశ సూక్తార్థముతో సంగతి పొందుచున్నదని గ్రహించవలయును.

ఈ సూక్తము కూడ సాయణాచార్యాద్యార్యావర్తీయుల చేతను, విల్సనాది యూరోపీయనులచేతను విపరీతముగ వర్ణించబడినది.

౧౨వ సూక్తము ౨౩వ వర్గము సమాప్తము.

---

౧౨. అత్ర శ్లేషాలంకారః. దివ్యానాం విద్యానాం ప్రకాశకత్వాద్దేవ శబ్దేన వేదా గృహ్యంతే. యథా మనుష్యైః సత్యభావేన వేదవాణ్యా జగదీశ్వరః స్తూయతే తదాఽయం ప్రీతః సంస్తాన్ విద్యాదానేన ప్రీణయతి. అయం భౌతికోఽగ్నిరపి విద్యయా కలా కౌశలేన సంప్రయోజిత ఇంధనాదిస్థః సన్ సర్వం క్రియాకాండం సేవతే.

ఇదమపి సూక్తం సాయణాచార్యాదిభిర్యూరోపవాసిభిర్విల్సనాదిభిశ్చాన్యథైవ వ్యాఖ్యాతమ్.

———

## ౧౩వ సూక్తము

౧౨ ఋక్కులుగల యీ పదమూడవ సూక్తమునకు ఋషి మేధాతిథి కణ్వుడు ౧౨ మంత్రములకు వరుసగ 'ఇధ్మః సమిద్ధోఽగ్నిః; తనూనపాత్, నరాశంసః, ఇడః, బర్హి, దేవీర్ద్వారః, ఉషాసా నక్తా, దైవ్యాహోతారా ప్రచేతసౌ, సరస్వతీడా భారత్యస్తిస్రో దేవ్యః; త్వష్టా వనస్పతిః; స్వాహాకృతయః' అను ౧౨ మంది దేవతలు. గాయత్రీ ఛందస్సు, షడ్జస్వరము.

౧. శ్లేషాలంకారమిందున్నది. ఏ మానవుడు పలురకముల సామగ్రిని సంగ్రహించి, విమానాదియానములందఖిల పదార్థముల లభింపజేయు నగ్నిని చక్కగ సంయుక్తపఱచునో యతని కాయగ్ని నానా విధముల సుఖమును సాధించుటకు హేతుభూతమగుచున్నది.

౨. శరీరాదుల సంరక్షించు నగ్నియొక్క గుణములు.

౨. అగ్నియందు సుగంధ్యాది పదార్థములను హవనమొనరించినపుడా యజ్ఞము వాయ్వాది పదార్థములను శుద్ధపఱచి, శరీరమును ఓషధులను రక్షించి పలువిధరసముల నుత్పాదనమొనర్చుచున్నది. ఆ యజ్ఞశుద్ధ పదార్థములను భోగించుటచే ప్రాణుల విద్యా జ్ఞాన బలముల యభివృద్ధి యగును.

౩. ప్రశంసనీయ భౌతికాగ్ని గుణములు వర్ణించబడుచున్నవి.

---

౧. అత్ర శ్లేషాలంకారః. యో మనుష్యో బహువిధాం సామగ్రీం సంగృహ్య యానాదీనాం వోఢార మగ్నిం ప్రయుంక్తే తస్మై స వివిధ సుఖ సంపాదన హేతు ర్భవతీతి.

౨. యదాఽగ్నౌ హవి ర్హూయతే తదైవాయం వాయ్వాదీన్ శుద్ధాన్ కృత్వా శరీరౌషధ్యాదీన్ రక్షయిత్వాఽనేకవిధాన్ రసాన్ జనయంతి, తైః శుద్ధై ర్భుక్తైశ్చ ప్రాణినాం విద్యాజ్ఞాన బలవృద్ధి రపి జాయత ఇతి.

౩. ఈ జగత్తునందే యీ భౌతికాగ్ని యుక్తిచే సేవింపబడినదై ప్రాణులకు ప్రియమును సమకూర్చునది యగుచున్నచో యట్టి యగ్నికేడు జిహ్వలు గలవు. ౧. కాళీ — శ్వేతాది వర్ణములను ప్రకాశింపజేయునది. ౨. కరాలీ — సహించ శక్యముకానిది. ౩. మనోజవా — మనస్సుతో సమానమైన వేగము కలది. ౪. సులోహితా — ఉత్తమమైన రక్తవర్ణము గలది ౫. సుధూమ్రవర్ణా — సుందరమైన ధూమ్రవర్ణముగలది. ౬. స్ఫులింగినీ — అనేక స్ఫులింగములను — అగ్ని కణములను విరజిమ్మునది. ౭. విశ్వరూపీ — సకల రూపములను కలిగియున్నది.

ఇది దేవి — అతిశయముగ ప్రకాశించునది. లేలాయమానా — ప్రకాశముతో సర్వత్ర గమనమొనర్చునది. లేలా దీప్తౌయను కండ్వాది ధాతువునకు యగాగమము. వ్యత్యయముచే ఆత్మనేపదమునైనది. ఆ సప్తవిధముల జిహ్వా — సర్వపదార్థములను గ్రహించునది — లభింప జేయునదై యున్నది. (మానవులు దానివలన ఉపకారమును పొంద వలయును.)

౪. ఉపకృతమైన యయ్యది దేనికి హేతువగుచున్నది?

---

౩. యోఽయం భౌతికోఽగ్నిరస్మిన్ జగతి యుక్త్యా సేవితః ప్రాణినాం ప్రియకారీ భవతి. తస్యాగ్నేః సప్త జిహ్వాః సంతి. కాలీ — శుక్లాది వర్ణ ప్రకాశికా. కరాలీ — దుఃసహా. మనోజవా — మనో వద్వేగవతీ. సులోహితా — శోభనో లోహితో రక్తో వర్ణో యస్యాః సా. సుధూమ్రవర్ణా — శోభనో ధూమ్రో వర్ణో యస్యాః సా. స్ఫులింగినీ — బహవః స్ఫులింగాః కణా విద్యంతే యస్యాం సా. అత్ర భూమ్న్యర్థ ఇనిః. విశ్వరూపీ — విశ్వం సర్వం రూపం యస్యాః సా. ఇతి సప్తవిధా.

పునః సా కింభూతా? దేవీ దేదీప్యమానా, లేలాయమానా — లేలాయతి సర్వత్ర ప్రకాశయతి యా సా. అత్ర లేలా దీప్తావిత్యస్మాత్ కండ్వాదిత్వా ద్యక్. వ్యత్యయే నాత్మనే పదం చ. సా జిహ్వోఽర్థా జో హువా పునః పునః సర్వాన్ పదార్థాన్ జుహోత్యాదత్తే ఽసావితి.

౪. వివిధ కలాయంత్ర సమన్వితము, భూ జలాంతరిక్షములందు గమనమొనర్చుటకు హేతువు, త్రివిధ రథములందు జలాదుల ద్వారా చక్కగా ప్రయోగించబడినదియునైన యగ్ని హితమొనగూర్చునది. సుఖతమమునై బహుకార్యసిద్ధి లభింపజేయునది యగుచున్నదని మానవులు గ్రహించవలయును.

౫. ఇటుల సంప్రయుక్తమైనది యేమిచేయునో ఉపదేశించబడుచున్నది.

౫. విద్వాంసులు అగ్నియందే ఘృతాదికమును వ్రేల్చుచున్నారో అయ్యది అంతరిక్షమునకు వెళ్లి, యచటనున్న జల సమూహమును శుద్ధమొనర్చుచున్నది. ఆ శుద్ధ జలము సుగంధ్యాది గుణములచే సమస్త పదార్థములను ఆచ్ఛాదనమొనర్చి వెంటనే సకల ప్రాణులను సుఖయుక్తముగ నొనర్చుచున్నది.

7. ఉక్త కర్మచే అహోరాత్రములు సుఖము చేకూరును.

7. ఇహమున మానవులు విద్యచే నుపకృతములైన అహోరాత్రములు సకల ప్రాణులకు సుఖహేతుకములు కాగలవని తెలిసికొనవలయును.

8. పరిశుద్ధమొనర్చు అప్రత్యక్షముగ నుండు విద్యుదగ్ని, ప్రత్యక్షముగ నుండు స్థూల రూపాగ్ని రెంటిని గురించి చెప్పబడుచున్నది.

8. ఒకటి విద్యుత్తు వేగాద్యనేక గుణములుగల అగ్నియైయున్నది. అటులనే ప్రసిద్ధాగ్నియు నుండుచున్నది. సకల పదార్థముల దర్శనమునకు హేతువులైన యీ రెండు చక్కగా వినియోగించబడినవై శిల్పాద్యనేక కార్యముల సిద్ధికి హేతువులగుచున్నవి. కావున మానవులీ రెంటినుండి వివిధోపకారములను పొందవలయును.

---

౪. మనుష్యై ర్బహుకలా సమన్వితో భూజలాంతరిక్ష గమన హేతురగ్ని ర్జలాదినా సహ సంప్రయోజిత స్త్రివిధే రథే హితకారీ సుఖతమో భూత్వా బహుకార్య సిద్ధిప్రాపకో భవతీతి బోధ్యమ్.

౫. విద్వద్భి రగ్నౌ యద్ ఘృతాదికం ప్రక్షిప్యతే తదన్తరిక్షను గతం భూత్వా తత్రస్థస్య జలసమూహస్య శోధకం జాయతే. తచ్చ సుగంధ్యాది గుణైః సర్వా న్పదార్థా నాచ్ఛాద్య సర్వాన్ ప్రాణినః సుఖయుక్తాన్ సద్యః సంపాదయతీతి.

9. ఆ విషయములో త్రివిధ క్రియలను ప్రయోగించవలయును.

9. పఠన పాఠనములకు ప్రేరణనొసగు 'ఇడా', ఉపదేశజ్ఞాన ప్రకాశము నొసగు 'సరస్వతి', అన్ని విధముల పూజి చతగినది ప్రశం సించతగినదియు కుతర్కముచే ఖండించ వీలుగానిదియు సర్వసుఖములు గలదియు నగు నీతి 'మహీ' ఈ త్రివిధవాణులు సర్వదా స్వీకరించదగినవి. దీనివలన నిశ్చయముగ అవిద్యా నిర్మూలనము విద్యా ప్రకాశము జరుగును.

10. అచ్చట మఱల నేమేమి చేయవలయును?

10. శ్లేషాలంకారమిందున్నది. అనంతానంద ప్రదుడగు నీశ్వరుడే మానవులకుపాస్యుడు. అటులనే సర్వపదార్థచ్ఛేదకము, రూపగుణము గలది, సర్వద్రవ్యప్రకాశము, అనుత్తమము, శిల్పవిద్యాసిద్ధికద్వితీయ సాధనమునైన యీ భౌతికాగ్ని యథావతుగ నుపయోగించతగినదని మానవులు భావించవలయును.

11. ఆ యగ్ని దేనిచే ప్రదీప్తమై యీ కార్యమును సాధించును?

11. పృథివీ జలమయములగు సర్వపదార్థములు యుక్తిచే సంప్రయుక్తములై అగ్నికి ప్రదీపకములై, రోగములను వినిగ్రహమొనర్చి, బుద్ధిబలముల నొసగుట వలన విజ్ఞానవృద్ధికి హేతువులునైన దివ్యగుణములను ప్రకాశింపజేయుచున్నవి.

12. ఈ క్రియాకాండమును మానవులెటులొనర్చ వలయును?

12. లుప్తోపమాలంకార మిందున్నది. మానవులు విద్వాంసులు క్రియాశీలురునై చక్కని విచారముతో క్రియా సమూహజన్యమైన కర్మ కాండను ప్రతి గృహమందు నిత్యము నొనర్చుచు, అందు విద్వాంసుల నాహ్వానించి, స్వయముగ వారి దగ్గరకు వెళ్ళిగాని వారి విద్యా క్రియానైపుణ్యములను గ్రహించవలయును. వీనిని సోమరులై వీరు ఎన్నటికి ఉపేక్షించవలదు. అని పరమేశ్వరు డుపదేశించుచున్నాడు.

అగ్న్యాది దివ్యపదార్థములయొక్క ఉపకారము గ్రహించు విధాన మీ 13వ సూక్తమునందుండుటచే నిది 12వ సూక్తాశయముతో మేళవించుచున్నదని గ్రహించవలయును.

ఈ సూక్తమునకు కూడ సాయణాదులు, యూరోపీయులైన విలసనాదులు విపరీతార్థమొనర్చిరి.

ఓ౩మ్

# ఋగ్వేద భావార్థ ప్రకాశిక

## ప్రథమ మండలము

### నాలుగవ అనువాకము

### పదునాలుగవ సూక్తము

చతుర్థ సూక్తమునందు 12 ఋక్కులు గలవు.
దీనికి ఋషి కణ్వ మేధాతిథి. దేవతలు విశ్వేదేవులు.
ఛందస్సు గాయత్రి. స్వరము షడ్జము.

◆◆◆◆◆◆

౧. అనేక పదార్థములతో సంయోగమొనర్చు నీశ్వర భౌతికా గ్నులు ఉపదేశించబడుచున్నవి.

౧. శ్లేషాలంకారమిందున్నది. మానవులకు వ్యావహారిక పారమా ర్థిక సుఖవాంఛ జనించవలయును. ఎవరు వాయు జల పృథివులతోకూడిన యంత్రములందు, యానములందు అగ్నిని చక్కగ సంలగ్నమొనర్చి యుత్తమ క్రియలను సాధించుదురో, ఈశ్వరాజ్ఞాపాలన మొనరించుదురో వారే సకల విధముల ఆనందమును పొందగలరు.

౨. అగ్ని శబ్దముచే నుభయార్థము లుపదేశించబడుచున్నవి.

౨. శ్లేషాలంకార మిందున్నది. ఈ సృష్టియందీశ్వర రచిత సకల పదార్థములను గాంచి యీ ధన్యవాదములు స్తుతి నిచయములు పరమాత్మకే సంప్రాప్తమగున్నవని మానవులు ప్రవచించవలయును.

౩. సమస్త దేవతలలోనుండి కొందరు దేవతలు చెప్పబడిరి.

౩. ఈ మంత్రమునందు 'కణ్వాః, అహూషత, గృణంతి' శబ్దముల అనువృత్తి వచ్చినది. ఏ మానవులు ఈశ్వరచితములైన ఇంద్రాది పదార్థముల గుణముల నెరిగినవారై వానిని క్రియయందు చక్కఁగ ప్రయోగించెదరో వారే సుఖులై సకల ప్రాణులను సుఖులుగ నొనర్చగలరు.

౪. ఇటుల సంప్రయుక్తములైన ఈ రెండు ఏ కార్యమును సాధించుచున్నవి ?

౪. మానవులందరి కీశ్వరుడుపదేశించుచున్నాడు.—నాచే సృజింపబడి ధరించబడి పూర్వమంత్రమునందు చెప్పబడిన విద్యుదాదులచే సకల పదార్థములేవి పోషించబడుచున్నవో వానినుండి ఎవరు వైద్యకశిల్పశాస్త్ర పద్ధతులచే ప్రకృష్టరసోత్పాదన మొనర్చి, శిల్పకార్యసిద్ధితోబాటు శ్రేష్ఠసేనను సంపాదించి రోగ వినాశనము విజయప్రాప్తి యొనర్చెదరో వారు నానావిధ సుఖములను భోగించెదరు.

౫. అగ్ని శబ్దముచే నీశ్వరుడని ఉపదేశించబడుచున్నది.

౫ సకల సృష్టి నిర్మాతా! పరమేశ్వరా! నీవు సమస్త ప్రాణికోటి సుఖమునకై సకల పదార్థములను సృజించి ధరించితివి కనుక మేమందరము నిన్నే స్తుతించుచు, సర్వుల రక్షణ వాంఛించుచు, శిక్షచేతను సకల మానవులను విభూషింపజేయుచు (నుత్తమ క్రియలొనర్చుటకై) నిత్యము ప్రయత్నించుచుండెదము.

౬. ఈశ్వరరచిత విద్యుదాదులెట్టి గుణములు కలవి ?

౬. మేఘాదులు జలమును అంతరిక్షమునకు చేర్చుచు, (వర్షము ద్వారా) రప్పించుచున్నవి. తంతి ద్వారా నడుపబడిన విద్యుత్తు వార్తను

అష్టకము, అధ్యాయము. వర్గము, మంత్రము అని ఒక విధముగను; మండలము, అనువాకము, సూక్తము, మంత్రము అని ఇంకొక విధముగను ఋగ్వేద మంత్రములు లెక్కపెట్టబడినవి. —అనువాదకుడు.

మనోవేగ సదృశముగ దేశాంతరమునకు చేర్చుచున్నది. అటులనే ఈశ్వ పదార్థములను సుఖములను లభింపజేయునవి ఈ పదార్థములే యని ఈశ్వ రుని నిర్దేశమై యున్నది.

—:ఇరువది యారవ వర్గము సమాప్తము:—

౭. అగ్ని శబ్దముచే నీశ్వర భౌతికాగ్నులుపదేశించ బడుచున్నవి.

౭. శ్లేషాలంకార మిందున్నది. మానవు లీశ్వరారాధన చేసి, చక్కగ అగ్ని ప్రయోగ మొనర్చియు రససారాదులను సిద్ధమొనర్చి, ఉప కారమునందుపయోగించి గృహస్థాశ్రమములో సకల కార్యములను సాధించవలయును.

౮. ఉక్త పదార్థము లెటులున్నవో ఉపదేశించబడుచున్నవి.

౮. ఈ జగత్తునందు సమస్త పదార్థములందు మానవులు ద్వివిధ కర్మల నాచరించవలయును. ఒకటి గుణజ్ఞానము. రెండు వానినుండి కార్య సిద్ధి పొందుట. విద్యుదాదులు సకల మూర్త ద్రవ్యములనుండి రసమును సంగ్రహించియే విడచుచున్నవి. కావున వాని శుద్ధికై సుగంధ్యాది పదార్థ ములను నిత్యము హోమమొనర్చవలయును. ఏలయనిన సకల ప్రాణులకు సుఖమును సాధించునవి కావలయును.

౯. ఎట్టి మానవులా గుణములను గ్రహించు యోగ్యులు కాగలరు?

౯. శ్లేషాలంకార మీ మంత్రమందున్నది. ఈశ్వరుడీ పదార్థముల నుత్పన్నమొనర్చనిచో ఏ మానవుడు ఉపకారము పొందుటకు సమర్థుడు కాజాలడు. మానవులు నిద్రలోపడి నిద్రించుచున్నచో ఏ విధమైన భోగ్య ద్రవ్యములను అనుభవింపజాలరు. కాని వారు జాగరణము పొందిన తర్వాత భోగించుటకు సమర్థులు కాగలరు. కనుకనే "ఉషర్బుధ" యను శబ్దమీ మంత్రమందు ప్రయోగించబడినది. (లోకములోని) ఈ సకల పదార్థములనుండి క్రియాసిద్ధిని ధీమంతులైనవారే సాధించ సమర్థులు కాగలరు. ఇతరులు కాజాలరు.

౧౦. దేనితోపాటు ఈ విద్యుదగ్ని క్రియలను సాధించునదగును ?

౧౦. ఈ విద్యుద్రూపాగ్ని బ్రహ్మాండస్థవాయువుతోను. శరీరస్థిత ప్రాణములతోను కలిసియుండి సకలపదార్థములనుండి రసమును గ్రహించి వెడల గ్రక్కుచున్నది.

౧౧. అగ్ని శబ్దముచే నీశ్వరుడుపదేశించ బడుచున్నాడు.

౧౧. ఏ యీశ్వరుడు సకల మానవుల (శరీరాదులను) సృజించి ధరించియున్నాడో, దేనివలన జ్ఞానకర్మోపాసనా కాండములందు పూజ్యతముడై విలసిల్లుచున్నాడో, అతడే యీ జగద్రూప యజ్ఞమును సృజించి మనలను సుఖింపజేయుచున్నాడు.

౧౨. భౌతికాగ్ని గుణములు వర్ణించబడుచున్నవి.

౧౨. విద్వాంసులు యంత్రములందు, విమానాదియానములందు అగ్న్యాది పదార్థములను మేళవింపజేసి, వానిచే మానవుల సుఖమునకై ఈ లోకమునందు దివ్యపదార్థములను వెల్లడి జేయవలయును.

సర్వదేవతల గుణముల ప్రకటన, వాని క్రియలను బహిర్గతము లొనర్చుటచే నీ 14వ సూక్తము యొక్క సంగతి 13 వ సూక్తార్థముతో కలియుచున్నదని గ్రహించవలయును.

సాయణాది విద్వాంసులు, విల్సనాది యూరోపు నివాసు లీ సూక్తమునకు విరుద్ధ విపరీతార్థమొనర్చిరి.

—:పదునాలుగవ సూక్తము—

ఇరువది యేడవ వర్గము సమాప్తము:—



16వ సూక్తమునకు ఋషి కణ్వమేధాతిథి. 12 గాయత్రి ఛంద
స్సులు గలవు. స్వరము షడ్జము. ఋతువులు. ఇంద్రుడు. మరుత్తులు.
త్వష్ట, అగ్ని, ఇంద్రుడు, మిత్రావరుణులు, ద్రవిణోదుడు, అశ్వినులు,
అగ్ని దేవతలు.

౧. ప్రతి ఋతువులో జరుగు రసోత్పత్తి గమనములు వర్ణించ
బడుచున్నవి.

౧. ఈ సూర్యుడు సంవత్సర... అయన... ఋతువులను పక్ష
ములను, అహోరాత్రములను, ముప్పది కళలుగల ముహూర్తములను,
ముప్పది కాష్ఠముల కళలను, 18 నిమేషములుగల కాష్ఠములను (కాల) విభ
జనగ చేసియున్నాడు. ఇది మనుస్మృతిలో లెక్కించబడిన కాలవిభాగ
పద్ధతి. వానిచే సకలౌషధముల సారమును, సమస్త స్థానములనుండి జల
ములను ఆకర్షించుచున్నాడు. అవి కిరణముల ఆధారముచే నంతరిక్షమున
నుండుచున్నవి. వాయ్వాధారమున గమనాగమనము లొనర్చుచున్నవి.

౨. ఋతువులతోపాటు పవనము సకల పదార్థముల నాకర్షించి
పవిత్రమొనరించుచున్నదని ఉపదేశించబడుచున్నది.

౨. ఋతువుల యనుక్రమము ననుసరించి వాయువునందును గుణ
ములు యథాక్రమముగ నుత్పన్నములగును. (ఆ కారణముచే) ఆ వాయు
వులు సమస్త త్రసరేణ్వాదుల చేష్టలకు హేతువులగుచున్నవి. అగ్ని
యందు సుగంధ్యాది పదార్థములను హోమమొనర్చుటచే పవిత్రములై
సమస్త ప్రాణులను సుఖయుక్తులగ నొనర్చి యవియే దానాదానములకు
హేతువులగుచున్నవి.

౩. ఋతువులతోపాటు విద్యుదగ్ని యేమి చేయుచున్నది?

౩. ఈ విద్యుదగ్నిది మిక్కిలి సూక్ష్మవస్తు. అది సకల మూర్త
ద్రవ్య సమూహావయవములలో చక్కగ వ్యాపించి వానిని ధరించుచున్నది.
ఛేదించుచున్నది. కనుకనే ప్రత్యక్షాగ్ని యుద్భవించుచున్నది. అందులోనే
విలయమొందుచున్నది.

29334/

౪. అగ్నియు సృతుయోజక మగుచున్నది.

౪. ఈ యగ్ని దాహగుణము గలది. (తన) రూప ప్రకాశముచే క్రింద మీద మధ్యనున్న సకల పదార్థములను సుశోభితములుగ నొనర్చు చున్నది. హవనమునందును శిల్పవిద్యయందును సంయోగమొనరించబడి దివ్య సుఖములను ప్రకటించుచున్నది.

౫. ఋతువులతోపాటు వాయువు ఏమేమి చేయుచున్నది?

౫. జగత్స్రష్టయైన యీశ్వరు డే యే వాయ్వాది పదార్థములం దేయే గుణ నియమములను స్థాపించెనో వానిని తెలిసికొని కార్యములను సాధించవలయును. ఆ కార్యసిద్ధివలన (లభించిన సంపత్తిచేత) సర్వర్తువు లందు సకల ప్రాణుల కనుకూలముగ హితము సమకూర్చవలయును. యుక్తిపూర్వకముగ సేవించబడిన పదార్థములు మిత్రతుల్యముగను, తద్విపరీతముగ సేవిత పదార్థములు శత్రుసమానముగ నగునని మానవులు గ్రహించవలయును.

౬. వాయు విశేషములైన ప్రాణోదానములు ఋతువులతో చేయునదేమిటో వివరించబడుచున్నది.

౬. బాహ్యగతి గలది సర్వమిత్రమునైనది ప్రాణము, (శరీరము లోనిది) అభ్యంతరగతి గలది బలసాధకమునైనదియు వరుణము ఉదానము. ఈరెంటి వలననే ప్రాణులు సర్వజగత్తును యజ్ఞమును బలమును చతుర్యోగము (ప్రాణాయామము) చే ధారణమొనర్చి వ్యాప్తములగు చున్నవి. వీనివలన సకల వ్యవహారములు సిద్ధించుచున్నవి

—: ఇరువది యెనిమిదవ వర్గము సమాప్తము :—

౭. ఈశ్వరుని యొక్కయు, భౌతికాగ్నియొక్కయు గుణములు వర్ణించబడుచున్నవి.

౭. శ్లేషాలంకారమిందున్నది. మానవులందరు కర్మోపాసనా జ్ఞాన కాండలచే సాధించదగిన యజ్ఞములందు పరాత్పరుడు పూజనీయుడు.

హోమ శిల్పాదుల యజ్ఞములందు భౌతికాగ్ని చక్కగ సంయుక్త మొనర్చతగినదియై యున్నది.

౮. అతడే నిఖిల పదార్థముల ప్రదాతయని చెప్పబడుచున్నది.

౮. పరమేశ్వరుడీ లోకములో ప్రాణులకే పదార్థములనిచ్చి యున్నాడో ఉపకారములందు వినియోగించబడు ప్రత్యక్ష ప్రత్యక్షము లైన వస్తుజాతమేది యున్నదో యవి విద్వాంసుల సంగమము వలననే సుఖప్రదములగుచున్నవి.

౯. యాజ్ఞికులు ఋతువునందొనర్చతగిన కార్యములు చెప్పబడు చున్నవి.

౯. ఈ మంత్రమందు వాచక లుప్తోపమాలంకారమున్నది. మాన వులు సత్కర్మలనే యనుకరణ మొనర్చవలయును. దుష్టకార్యములను కాదు, ఋతువులన్నిటియందు యథాయోగ్య కర్మలాచరించవలయును. ఏ ఋతువునందే దేశము ఉండుటకు, వెళ్లుటకు, యోగ్యమో అట వసించవల యును, వెళ్ళవలయును. ఆదేశానుసారముగ భోజనాచ్ఛాదన విహారము లొనర్చవలయును. ఇత్యాది వ్యవహారములచే నిరంతరము సుఖమును సేవించవలయును.

౧౦. ప్రతి ఋతువునందీశ్వరుని ధ్యానమొనర్చవలయును.

౧౦. పరమేశ్వరుడు స్థూల సూక్ష్మ కారణాఖ్య జగత్తుకంటె భిన్నుడై చతుర్థునిగ విలసిల్లుచున్నాడు. అతడు సర్వాభివ్యాపి, సర్వాంత ర్యామి, సర్వాధారుడు మానవులకందఱికి పూజనీయుడు. అతనిని త్యజించి యే యితర పదార్థమును ఈశ్వరభావముతో నుపాసించజనదు. ఇతనికంటె భిన్నుడెవడు కర్మానుసారముగ జీవములకు ఫలప్రదాత లేడు.

౧౧. ఋతుసంయోగముచే సూర్యచంద్రుల గుణములుపదేశించ బడుచున్నవి.

౧౧. ఈశ్వరుడుపదేశించుచున్నాడు. ఈశ్వరుడనైన నాచే సూర్యచంద్రులవలెనే యే రెండురెండు పదార్థములు సంయుక్తములొనర్చ

బడియున్నవో మానవులారా! అయ్యవి సకలర్తువులందు మీకు సుఖమును వ్యవహారసిద్ధియు జేకూర్చుచున్నవి. ఈ విషయమందఱు గ్రహించెదరు గాక!

౧౨. మఱల భౌతికాగ్ని గుణము లుపదేశింపబడుచున్నవి.

౧౨. సమస్త వ్యవహార కార్యములందు ప్రతి ఋతువులో విద్య చేత చక్కగ సంప్రయోజితమైన యే యగ్నియున్నదో యది మనుష్యాది ప్రాణుల కొఱకు దివ్యసుఖములను సమకూర్చుచున్నది.

సమస్త దేవుల కనుయోగ్యతను యథాక్రమముగ ప్రతిపాదించుటచే పదునైదవ అధ్యాయముయొక్క అర్థమునకు పదునాల్గవ అధ్యాయార్థముతో సంగతమగుచున్నది.

ఈ సూక్తముకూడ సాయణాద్యాచార్యుల చేతను, విలసనాదుల చేతను విపరీతముగ వ్యాఖ్యానమొనర్చబడినది.

—:పదునైదవ సూక్తము–ఇరువది తొమ్మిదవ వర్గము సమాప్తము:—

---

## ౧౬వ సూక్తము

పదహారవ సూక్తములో తొమ్మిది ఋక్కులున్నవి.

వీనికి కాణ్వమేధాతిథి ఋషి. దేవత ఇంద్రుడు.

గాయత్రీ ఛందస్సులు. షడ్జస్వరము.

౧ సూర్యుని గుణములు వర్ణించబడుచున్నవి.

౧. సూర్యుని దీప్తులు సకల రసములను హరించునవి, అన్నిటిని ప్రకాశింప జేయునవి, వర్షము కురుపించునవియునై యున్నవి. అవి మానవులచే యథాయోగ్యమైన అనుకూలముగ సేవించబడినవియై ఉత్తమోత్తమ సుఖములను లభింపజేయు చున్నవి.

౨, మఱల సూర్యలోక గుణములే వర్ణించబడు చున్నవి.

౨. ఈ లోకములో రేయింబవళులు, శుక్ల కృష్ణ పక్షములు, దక్షిణోత్తరాయణములు హానీ-వృద్ధి మొనర్చునవి అని అనబడుచున్నవి. సూర్యుడు వానిచే సర్వానంద దాయక వ్యవహారములను [illegible]చున్నాడు.

౩, ఇంద్ర శబ్దముచే మూడర్థములను బోధించుచున్నాడు.

౩. మానవులు ప్రతిదినము పరమేశ్వరుని ఉపాసించ వలయును. అతని యాజ్ఞయందు ప్రవర్తించ వలయును. ప్రతి యజ్ఞమునందు విద్యు దగ్నిని సంయోగ పఱచ వలయును. ప్రాణవాయు విద్యచే పదార్థములను భోగమొనర్చవలయును.

౪. ఇంద్ర శబ్దముచే వాయువు గుణములు చెప్పబడుచున్నవి.

౪. శిల్పాది వ్యవహారము లందుపయోగములైన పదార్థము లేవి యున్నవో యవి అగ్ని విద్యుత్ సూర్యుల వలననే ప్రకాశితము లగు చున్నవి మఱియు గమనాగమనము లొనర్చు చున్నవి.

౫. పునరింద్ర గుణము లుపదేశించ బడుచున్నవి.

౫. ఉపమాలంకార మిందున్నది. అత్యంత పిపాసువులైన పశు మృగాదులెటుల వేగముగ పరుగు దీసి ఉదకాశయమును పొంది జలమును పాన మొనర్చునో యటులనే ఈ ఇంద్రుడు- సూర్యలోకము వేగవంతము లగు కిరణములచే నోషధ్యాదులను పొంది వాని రసమును పానమొనర్చు చున్నది. (కనుక) మానవులీ విద్యావృద్ధికై యథావతుగ నిదాని నుపయోగించ వలయును.

—:ముప్పదియవ వర్గము సమాప్తము:—

౧. వాయువెందుకు, ఎందులోనుండి ఏ రసమును త్రాగుచున్నది?

౧. ఈశ్వరుడీ లోకములో ప్రాణుల యొక్క బలాదుల వృద్ధికై యెన్ని మూర్త పదార్థములను సృజించెనో, సూర్యుని ద్వారా ఛేదింప బడిన వానిని వాయువు స్వసమీపస్థములుగ నొనర్చి ధారణ మొనర్చు చున్నది. దాని సంయోగముచే ప్రాణులు అప్రాణులు సమస్తము బల (పరాక్రమము)ను పొందుచున్నవి.

౬. వాయువెట్టి గుణము గలదో వివరించబడుచున్నది

౬. మానవులచే శోధించబడి ఉత్కృష్ట గుణములు గల యీ వాయువు అతిశయ సుఖమును సమకూర్చునది యగుచున్నది.

౭. మరల దాని గుణములే ఉపదేశించ బడుచున్నవి.

౭. వాయువు ఆకాశమున గమనాగమనము లొనర్చి జగత్తంతయు వ్యాపించే వేగవంతము, మేఘహంతకము (మేఘమును వర్షింపజేయునది) నై సకల ప్రాణులకు సుఖము చేకూర్చుచున్నది. ఇది లేకుండ ఎవరును ఏ వ్యవహారమును సాధించుటకు సమర్థులు కాజాలరు.

౮. ఇంద్ర శబ్దముచే నీశ్వర గుణము లుపదేశించబడినవి.

౮ పురుషార్థులు, ధార్మికులు నగు మానవుల సకల కామనలను వారి వారి కర్మల ననుసరించి పూర్తి చేయు సామర్థ్యము పరమాత్మునకు కలదు. సృష్టియందు సర్వోత్తమ పదార్థములను సృజించి ఎవడు ధారణ మొనర్చి సకల ప్రాణులను సుఖింప జేయుచున్నాడో యతడు సర్వులకు నిత్య ముపాసనీయుడు. ఇతరుడు కాడు

ఋతువుల సంపాదకములగు సూర్యవాయ్వాదులు యథాయోగ్యముగ ప్రతిపాదించ బడుటచేత నీ పదునారవ సూక్తార్థము పంచదశ సూక్తార్థముతో సంగతమగుచున్నది.

ఈ సూక్తమునకు కూడ సాయణాచార్యుడు, యూరోపియనులైన విలసన మొదలైనవారు వ్యతిరేకముగ భాష్యమొనరించిరి.

—:పదునారవ సూక్తము; ముప్పది యొకటవ వర్గము సమాప్తము:—



# ౧౭వ సూక్తము

17వ సూక్తములో 9 ఋక్కులున్నవి

ఋషి కాణ్వో మేధాతిథి; ఇంద్రావరుణులు దేవతలు.

1,3,7,9 గాయత్రి; 2. యవమధ్యా విరాడ్గాయత్రీ. 4. పాదనిచృద్గాయత్రీ. 5. భురిగార్చీ గాయత్రీ. 6. నిచృద్గాయత్రీ. 8. పిపీలికా మధ్యా నిచృద్గాయత్రీ చ ఛందః; షడ్జ స్వరము.

౧. ఇంద్రవరుణుల గుణములు చెప్పబడుచున్నవి

౧. ప్రకాశవంతములు, జగదుపకారములు, సర్వ సుఖదములు, సకల వ్యవహారములకు హేతువులు, చక్రవర్తి రాజ్యమువలె రక్షకములు నగు సూర్యచంద్రులెటుల యున్నారో అటులనే మనమునుండవలయును.

౨. ఇంద్రవరుణులతో సంయుక్త మొనర్చబడిన అగ్ని జలముల గుణము లుపదేశించబడుచున్నవి.

౨. పూర్వ మంత్రమునుండి 'అవృణే' అను క్రియాపదమిందు అనువర్తించబడినది. ఎప్పుడు విద్వాంసులచే యుక్తిపూర్వకముగ కలాయంత్రములందు అగ్ని జలములు సంయోగ మొనర్చబడి ప్రేరేపించబడుచున్నవో అప్పుడవి శీఘ్ర గమనములకు కారకములు, అచ్చటనున్న మనుష్యాది ప్రాణులను, పదార్థభారములను ధారణ మొనర్చుటకు హేతువులు, సుఖదాయకములు నగుచున్నవి.

౩. ఇటుల సాధించబడిన యీ జంట దేనికి హేతువగును ?

౩. అగ్ని జలముల గుణముల నెఱిగి క్రియయందు సంప్రయోగించబడిన యే రెండు బహుసుఖములను లభింపజేయుచున్నవో మానవులు వానిని కార్యములందు చక్కగా ప్రయోగించవలయును.

౪. ఉక్త కార్యము నొనరించుటచే నేమి యగును ?

౪. అవిద్యను దరిద్రమును సమూలముగ నాశ మొనర్చుటకై

మానవులు సర్వదా ప్రమాదాలస్యములను త్యజించి, మంచి పనులను చేపట్టవలయును. విద్వాంసులతో నిత్యము సమాగమమొనర్చుచుండవలయును.

౫. ఇంద్రవరుణులెట్టివారో చెప్పబడుచున్నారు.

౫. పూర్వ మంత్రమునుండి యిట 'హి' శబ్దపు అనువృత్తి జరిగినది. పృథివ్యాదులు అన్నాదులు, దాన సాధన నిమిత్తములగు పదార్థము లెన్నియున్నవో వానియన్నిటిలో అగ్ని విద్యుత్సూర్యులు ముఖ్యములు. వీనిమధ్య జలవాయు చంద్రులేవి యున్నవో వాని గుణములతోబాటు వాని స్తుతి యొనర్చవలయును. వానివి గుఱించి ఉపదేశ మొనర్చవలయును. ఏల్లయన తమ తమ గుణములతో బాటు అవి ప్రశంసనీయములు, తెలుసుకోదగినవియునై యున్నవి. వాని నెఱిగి క్రియా కౌశల్యమునందు వినియోగింపబడుచో (నవి) క్రియాసంసిద్ధికి హేతువులు కాగలవు.

—: ముప్పది రెండవ వర్గము సమాప్తము :—

౧. ఆ రెంటిచే మానవు లేమేమి చేయవలయును?

౧. మానవులు అగ్న్యాది పదార్థముల నుపయోగించి సంపూర్ణ ధనములను సంపాదించి, (వానిని) రక్షించి, వృద్ధిజేసి వానిని యథా యోగ్యముగ వ్యయమొనర్చి (విద్యా) రాజ్యవృద్ధుల నొనర్చి సర్వహిత మొనర్చవలయును.

౨. ఎటువంటి ధనమునకై ఉపాయమొనర్చవలయును?

౨. ఏ మానవులు బాగుగ సాధించబడిన మిత్రావరుణులను కార్యములందు సంయుక్తపఱచుదురో వారు వివిధ ధనములను విజయములను పొంది సుఖులై యితరులనుకూడ సుఖింపజేయుచున్నారు.

౩. పూర్వ మంత్రమునుండి 'హువే' అను పదము అనువృత్తి యైనది. ఏ మానవులు శాస్త్ర సంస్కారములచేతను పురుషార్థము చేతను (శ్రేష్ఠత్వమును పొందిన) బుద్ధుల ద్వారా శిల్పాది సకల శ్రేష్ఠ వ్యవహారములందు మిత్రావరుణులను శ్రేష్ఠ విధితో సంయోగపఱచెదరో వారే ఈ లోకమున సుఖములను విస్తరింపజేయుదురు.

౯. ఈ రెంటియొక్క (ఇంద్రుని వరుణుని) యథాయోగ్య గుణములను స్తుతించవలయును.

౯. ఏ పదార్థమున కెట్టి గుణములు కలవో వానిని సువిచారముచే తెలిసికొని మానవులు నిరంతరము ఉపకారమును గ్రహించవలయునని పరమాత్ముని యుపదేశము.

పూర్వపు 16 వ సూక్తములో వివరించబడిన మిత్రావరుణుల అర్థములిచట ప్రతిపాదించబడుటచే 17వ సూక్తార్థమునకు 16వ సూక్తార్థమునకు సంగతి కలియుచున్నది.

ఈ సూక్తమునకు కూడ సాయణాచార్యాదులు. విలసనాది యూరోపీయులు విపరీతార్థములలో వ్యాఖ్యానమొనర్చిరి.

—: 4వ అనువాకము, 17వ సూక్తము; 33వ వర్గము సమాప్తము :—

## ౧౮ వ సూక్తము

9 ఋక్కులుగల 18వ సూక్తము. కాణ్వమేధాతిథి ఋషి. 1. 2. 3 కి బ్రహ్మణస్పతి; 4 కి బృహస్పతీంద్ర సోములు; 5కి బృహస్పతి దక్షిణలు; 6, 7, 8 కి సదసస్పతి; 9కి సదసస్పతి నారాశంసులు దేవతలు; 1. విరాడ్గాయత్రి; 2 7,6 గాయత్రి; 3,6.8 పిపీలికా మధ్యానిచృద్గాయత్రీ; 4 నిచృద్గాయత్రీ: 5 పాదనిచృద్గాయత్రీ ఛందస్సులు. షడ్జస్వరము.

i యజమానుడెట్టి ఈశ్వర ప్రార్థన యొనరించవలయును?

i వాచక లుప్తోపమాలంకార మిందున్నది. ఎవడైనా విద్యాప్రకాశమునందు ప్రసిద్ధుడైన వాడే అధ్యాపకుడు (కాగలడు.) సకల శిల్ప విద్యా సంపాదకుడు కాగలడు. ఏలయన ఈశ్వరుడును ఇట్టి మానవునినే తన యనుగ్రహముతో ప్రేమించుచున్నాడు.

(ఇందలి "ఔశిజ_కక్షీవంత" శబ్దములకు) సాయణుడు పురాణముల భ్రాంతిచేత ఒకదానికి నొకదానిని వర్ణించెను. (కక్షీవంతమ్ = యాః కక్షాసు కరాంగులి క్రియాసు భవాః శిల్పవిద్యాస్తాః ప్రశస్తా విద్యంతే

యస్య తమ్. 'ఉశిజ ఇత్యం గులి నామసు పఠితమ్, నిఘం. 25. అత్ర ఔశబ్దాద్ ఛికే ఛందసి ఇతి యత్ అతః ప్రశసాయాం మతుప్, కక్ష్యాయాః సంజ్ఞాయాం మతౌ సంప్రసారణం కర్తవ్యమ్. అ 6_1_37 అనేన వార్తికేన సంప్రసారణమ్. ఆ సందీవద... అ 8_2_12 ఇతి నిపాతనా న్మకారస్య వకారాదేశః ఔశిజః = య ఉశిజి ప్రకాశే జాతః స ఉశిక్ తస్య విద్యావతః పుత్ర ఇవ. (మహర్షి దయానంద భాష్యమ్.)

2. మరల అతడెట్టివాడో ఉపదేశించుచున్నాడు

2. ఏ మానవులు సత్యభాషణాది లక్షణములుగల ఈశ్వరాజ్ఞను అనుష్ఠించెదరో వారు అవిద్యాది రోగరహితులు. శరీరాత్మ బలములు గలవారై చక్రవర్తి రాజ్యాది ధనములను, సర్వరోగహరణములు నగు నౌషధములను పొందుచున్నారు.

3. ఈశ్వర ప్రార్థన ఉపదేశించబడున్నది.

3. ఏ మానవుడు ధూర్త మానవునితో నెన్నటికి సాంగత్య మొనర్చగూడదు. అన్యాయముగ నెవనిని హింసించగూడదు. మరేమనిన అందఱు న్యాయముతో నందఱిని రక్షించవలయును.

4. ఇంద్రాదుల కృత్యములు వర్ణించబడుచున్నవి.

4. ఎవరు వాయు విద్యుత్సూర్యసోమౌషధములను సంగ్రహించి కార్యములను సాధించుచున్నారో వారు సుఖములను పోగొట్టుకొనినవారు కాజాలరు.

5. వారు రక్షకులెటులగుదురు?

5. ఏ మానవులు అధర్మమునుండి దూరముగ నుండి స్వకీయ సుఖవృద్ధిని అభిలషించుచున్నారో వారు పరమేశ్వరుని యుపాసించి సోమున్ని. ఇంద్రున్ని. దక్షిణను యుక్తిపూర్వకముగ సేవించగలరు.

—: ముప్పది నాలుగవ వర్గము సమాప్తము :—

6. ఇంద్రశబ్దముచే పరమేశ్వరుని గుణములు చెప్పబడుచున్నవి.

6 ఏ మానవులు సర్వశక్తిమంతుడు, సర్వాధిష్ఠాత సర్వానందప్రదుడు నగు పరమేశ్వరుని ఉపాసించెదరో; ఎవరు సర్వోత్కృష్ట గుణస్వభావములు గలవాడు, పరోపకారియునగు వానినే సభాపతిగ పొందు

దరో వారే సర్వశాస్త్ర బోధతో కూడిన ధీ ని పొంది పురుషార్థులు విద్వాం
సులునై సుఖులయ్యెదరు.

7. అతడే జగత్తంతటిని రచించుచున్నాడు.

7. వ్యాపకుడైన పరమాత్మకు వ్యాప్యమైన సర్వజగత్తునకు నెట్టి
నిత్య సంబంధము కలదు. అతడే సకల జగత్తును రచించి, దానిని
మొనర్చి, అందరి బుద్ధులను కర్మలను ఎఱిగి సకల ప్రాణులకు వాని
వాని కర్మానుసారము సుఖదుఃఖాత్మకమైన ఫలముల నొసగుచున్నాడు.
ఈశ్వరుడు లేకుండ స్వభావముచే సిద్ధించునది అనగా ఏ యజమాని
లేనిదియు నగు లోకమేదియు నుండదు. ఏలయన జడపదార్థములు విజ్ఞా
నము కలిగియుండక పోవుటచే (నచేతనము లగుటచే)యథాయోగ్య నియ
మము ననుసరించి ఉత్పత్తి జరుగుటకు అనర్హములు.

8. ఆ యజ్ఞ మెట్టిది ?

8. పరాత్పరుడు సకల సంసారమును రచించుచున్నాడు. కావున
సమస్త పదార్థములు పరస్పరము కలయికచే అభివృద్ధి జెందుచున్నవి.
ఇవి క్రియామయమైన యజ్ఞమందు శిల్పవిద్యయందు చక్కగా ప్రయుక్త
ములై గొప్ప గొప్ప సుఖములను కలిగించుచున్నవి.

9. మఱల అతడెట్టివాడో వివరించబడుచున్నది.

9. ఉపమాలంకార మిందుగలదు. ఏ విధముగ మానవుడు
విస్తృతమైయున్న సూర్యాదుల ప్రకాశమును చూచుచున్నాడో అటులనే
సర్వత్ర వ్యాప్తుడు జ్ఞానప్రకాశ స్వరూపుడునగు పరమేశ్వరుని నెఱిగి
విస్తృత సుఖములు కలవాడగుచున్నాడు.

ఇట సప్తమ మంత్రమునుండి 'సదసస్పతి' శబ్దము అనువృత్తి
యైనది.

మిత్రావరుణులతోపాటు అనుయోగిత్వమగు బృహస్పత్యాదుల
యర్థములను ప్రతిపాదించుటచే పూర్వసప్తదశ సూక్తార్థముతో నీ 18వ
సూక్తార్థమునకు సంబంధము కలదని గ్రహించవలయును.

ఈ సూక్తమునకు కూడ సాయణాచార్యాదులు. విలసనాది యూరో పీయ విద్వాంసులు విరుద్ధ విపరీతార్థము లొనర్చిరి.

—: 18వ సూక్తము, 36వ వర్గము సమాప్తము :—



## ౧౯వ సూక్తము

తొమ్మిది ఋక్కులు గల 19వ సూక్తమునకు కాణ్వమేధాతిథి ఋషి అగ్ని మరుత్తులు దేవతలు. 1,3—8 గాయత్రి; 2 నిచృద్గాయత్రి. 9 పిపీలికా మధ్యానిచృద్గాయత్రీ; షడ్జస్వరము.

భౌతికాగ్ని గుణములు ఉపదేశించబడుచున్నవి.

1. ఏ భౌతికాగ్ని ప్రసిద్ధమగు సూర్యరూపముతోను విద్యుద్రూపముతోను పవనములవలన ప్రదీప్తమగుచున్నదో అద్దానిని విద్వాంసులు ప్రశంసనీయమైన బుద్ధిచేత ప్రతి క్రియయొక్క సిద్ధికొఱకు, అందఱి రక్షణకొఱకును దాని గుణ జ్ఞానములతో సహా ఉపదేశించవలయును. ఇతరులవలన వినవలయును.

2. అగ్ని శబ్దముచే నీశ్వర భౌతికాగ్నుల గుణములు వివరింపబడుచున్నవి.

2. సర్వోత్తముడగు పరాత్పరుని మహిమలు కర్మలు అనంతములగుటచే నెవరును అతని యంతమును పొందజాలరు, గ్రహించజాలరు. మఱేమనిన ఎవనికెంత విద్యాబుద్ధులుండునో అతడంతయే సమాధియోగయుక్తముచేతను ప్రాణాయామముచేతను అంతర్యామి రూపముతో స్థితుడై యున్నవానిని, వేదములందును సృష్టిలోను (పంచ) భూత సంబంధమైన మరుత్తులకు సంబంధించిన స్వకీయమైన స్వరూప గుణముల నెంతవరకు ప్రకాశింపబడియున్నవో అంతవరకే వాడు గ్రహించగలడుగాని అంతకంటె నధికముగ గ్రహించజాలడు.

3. అగ్ని శబ్దముచే నీశ్వర భౌతికాగ్నుల గుణములు వర్ణించ బడుచున్నవి.

3. ఏ విద్వాంసులు అగ్నిద్వారా ఆకర్షణ ప్రకాశము లొసర్చ బడి, పవనములచే చేష్ట యొనర్చబడినవియు నగు నేలోకములున్నవో వాని నన్నింటిని తెలిసికొని కార్యములందుపయోగించుట ఎరుగుదురో వారు సుఖవంతులయ్యెదరు.

4. మరల నామరుత్తు లెట్టివో వివరించబడుచున్నవి.

4. బలమెంత యుండునో అది యంతయు వాయువిద్యుత్తుల నుండియే పుట్టుచున్నది, ఈ వాయువులు సకల లోకములను ధరించు చున్నవి. వీని సంయోగముచేతనే విద్యుత్సూర్యాదులు ప్రకాశించును,ధరించ బడుచున్నవికూడ. కనుక వాయుగుణముల జ్ఞానముచేతను, వానినుండి ఉపకారము గ్రహించుటచేతను అనేక విధముల కార్యములు సిద్ధించు చున్నవి.

5. ఆ వాయువు లెట్టివో ఉపదేశించబడుచున్నది.

5. యజ్ఞధూమముచే శోధించబడిన యే వాయువులున్నవో అవి సురాజ్యమునకు నిమిత్తకారిణులై రోగాది దోషములను నశింపజేయునవి యగుచున్నవి. అశుద్ధవాయువులు సుఖములను నశింపజేయును. కావున సకల మానవులు అగ్నిద్వారా వాయువును శోధించి సుఖములను చక్కగా సాధించవలయును.

—: ముప్పదియారవ వర్గము సమాప్తము :—

6. ఆ వాయువు లెట్టివి?

6. సకల లోకములు ఈశ్వరుని ప్రకాశము వలననే ప్రకాశితము లై యున్నవి. కాని అతడు రచించిన సూర్య లోకము యొక్క దీప్తి చేత పృథివీ చంద్రాది లోకములు ప్రదీప్తము లగుచున్నవి. ఆ దివ్య గుణము లచే నొప్పారు నీ యగ్నిని సకల కార్యములందు సంయోగపరచవలయును.

7. ఆ పవనము లే కార్యములకు హేతువు లగుచున్నవి?

7. వాయు సంయోగముచే వర్షము కురియును. జలము యొక్క కణములు, రేణువులు అనగా సకల పదార్థముల అత్యంత లఘు కణములు పృథ్వి నుండి అంతరిక్షమునకు పోవును, అటనుండి పృథివికి వచ్చును. వానితో పాటు లేక వాని నిమిత్తముచే విద్యుత్తు పుట్టుచున్నది. మరియు మేఘములలో దాగి ఉండుచున్నది.

8. ఇవియే ప్రకాశాదులను విస్తరింప జేయుచున్నవి.

8. ఈ వాయువుల ప్రాప్తి చేత సకల పదార్థములు వృద్ధి జెంది బలమునకు హేతువులగు చున్నవి. కావున మానవులు వాయ్వగ్నుల యోగముచే అనేక కార్యసిద్ధులను విభావన మొనర్చ వలయును.

9. మఱల వానిచే నేమి సాధించ వలయును?

9. విద్వాంసులారా! ఏ వాయ్వగ్న్యాది పదార్థముల ద్వారా సంపూర్ణమైన క్రియామయమగు యజ్ఞము సాధించబడు చున్నదో వాని ద్వారానే సకల మానవులు సమస్త కార్యములు సాధించ వలయును.

18వ సూక్తములో చెప్పబడిన బృహస్పతి మొదలైన పదార్థములతో పాటు ఈ 19వ సూక్తములో ప్రతిపాదించ బడిన అగ్ని వాయువుల విద్యకు ఏకత్వము కలుగుటచే నీ సూక్తము యొక్క సంగతియు గ్రహించ వలయును.

ఈ అధ్యాయములో అగ్నిని, దీనికి వాయ్వాదులకు సంబంధించిన విద్య నుపయోగించుటకు ప్రతిపాదించెను. పవనములకు సహకారిణి యగు నగ్నిని చివరకు ప్రకాశింప జేయుచు నీశ్వరుడు అధ్యాయ సమాప్తిని సూచించెను.

ఈ సూక్తమునకు కూడ సాయణాచార్యాదులు, విలసనాది యూరపీయ విద్వాంసులు విపరీతార్థ మొనర్చిరి.

ప్రథమాష్టకములో ప్రథమాధ్యాయము. 19వ సూక్తము 37వ వర్గము సమాప్తము.

ఇతి శ్రీమత్పరి వ్రాజకాచార్యేణ దయానంద సరస్వతీ స్వామినా విరచితే సంస్కృతార్య భాషాభ్యాం విభూషితేసు ప్రమాణ యుక్తే వేద భాష్యే ప్రథమాష్టకే ప్రథమోఽధ్యాయ ఏకోనవింశం సూక్తం సప్తవింశో వర్గశ్చ సమాప్తః.

—***—

## —: ౨౦వ సూక్తము :—

8 ఋక్కులు గల 20వ సూక్తమునకు కాణ్వ మేధాతిథి ఋషి. ఋభువులు దేవతలు. 1,2,6,7 గాయత్రి, 3 విరాడ్గాయత్రి, 4 నిచృద్గాయత్రి, 5,8 పిపీలికా మధ్యా నిచృద్గాయత్రి ఛందస్సులు. షడ్జ స్వరము.

1. ఋభువు యొక్క స్తుతి చెప్పబడుచున్నది.

1. ఇందు పునర్జన్మ విధాన మున్నదని గ్రహించ వలయును. మానవులు లెట్టి కర్మ లొనర్చెదరో అట్టి జన్మలను భోగములను పొందుదురు.

2. ఋభువు లెట్టివారు?

2. ఏ విద్వాంసులు పదార్థముల సంయోగ విభాగములచే ధారణాకర్షణ వేగాది గుణముల నెఱిగి యంత్రయష్టి భ్రామణాది క్రియాకలాపముతో శిల్ప వ్యవహారాది యజ్ఞములను నిష్పాదన మొనరించుదురో వారే పరమైశ్వర్యమును పొందెదరు.

3. ఆ విద్వాంసులు దేనిచే నేమి సాధించవలయును?

4. ఏ మానవులు (అంగ ఉపాంగ) ఉపవేదములతో సహా వేదములను జదివి, వానివలన కలిగిన విజ్ఞానముచే అగ్న్యాది పదార్థముల

గుణముల నెఱిగి కలా యంత్ర యుక్తములగు యానములందు వానిని సంయోగ పఱచి విమానాదులను నిర్మించుచురో వారెన్నటికి దుఃఖ దారిద్ర్యములను పొందనే పొందరు.

4. ఆ విద్వాంసు లెట్టివారో మరల ఉపదేశించ బడుచున్నది.

4. ఎవరు అలస్యము (సోమరి తనము) ను త్యజించు వారు సత్య ప్రియులు, ఋజు స్వభావము గల వారలునై యుందురో వారే అగ్ని వాయు జలాది పదార్థముల నుండి ఉపకారము పొందుటకు సమర్థులగుచున్నారు.

5. వీరు దేనిచే నేమి చేయుదురు?

5. ఏ విద్వాంసులు ఎప్పుడు వాయు విద్యుద్విద్యల ద్వారా సూర్య కిరణ (సదృశ) ముల (గు) తో అగ్నేయాస్త్రాదులను. (కరవాలాది) శస్త్రములను యానములను నిష్పన్న మొనర్చెదరో అప్పుడు వారు శత్రువులను జయించి రాజులై సుఖులయ్యెదరు.

మొదటి వర్గము సమాప్తము.

6. ఉపర్యుక్త కార్య మొనరించు సామర్థ్య మెవరికున్నది?

6. మానవులు క్రియా కౌశల్యము గల ఏ శిల్పి వద్దనో ఉండి అతని కృతి చాతుర్యమును అలవరచుకొనిన శిల్ప సాధ్య కార్యములను సుకరముగ సాధించ సమర్థులగుదురు.

7. సాధించ బడిన వీనిచే ఫలమేమి లభించును?

7. చతురాశ్రమములకు సంబంధించిన ఏ కర్మ చతుష్టయమున్నదో యజ్ఞానుష్ఠానాది యే మూడు కర్మలున్నవో వానివి మనోవాక్కాయములతో నాచరించ వలయును. ఇటుల నివి సప్త కర్మ లగుచున్నవి. ఏ మానవులు వీని నాచరించెదరో వారి సాంగత్యమును ఉపదేశమును పొందుట చేతను, విద్య చేతను, రత్న లాభము చేతను సుఖములు కలుగును.

కాని ఏకైక కర్మను చక్కగ సాధించి సమాప్త మొనర్చి రెండవ దాని నుపక్రమించ వలయును. ఈ క్రమముగ శాంతి పురుషార్థముల ద్వారా సకల కర్మలను సేవించ వలయును.

8. వారీ కర్మ నొనర్చి దేనిని పొందుచున్నారు?

8. మానవులు సుకృతులను, విద్వాంసుల సాంగత్యమును పూర్వోక్త యజ్ఞానుష్ఠానమును ఒనర్చి, వ్యవహార సుఖము మొదలు మోక్ష సుఖ పర్యంతము (సకల సుఖములను) పొందవలయును.

19వ సూక్తములో చెప్పబడిన పదార్థముల నుండి ఉపకారము పొందుటకు బుద్ధిమంతులే సమర్థులు. కావున ఈ 20వ సూక్తార్థముయొక్క సంగతి 19వ సూక్తముతో కలదని గ్రహించ వలయును.

సాయణా చార్యాదులు, విలసనాది యూరోపీయ విద్వాంసులీ సూక్తమునకు విపరీతార్థ మొనరించిరి.

ఇరువదియవ సూక్తము, రెండవ వర్గము సమాప్తము.

ఒక సవరణ:— 15 వ పుటలో నారవ మంత్ర భావార్థము ముద్రించబడలేదు. అయ్యది యిది:—

6. అనేక ద్వారములుగల యజ్ఞశాలలను విమానములను నిర్మించ వలయునని యుపదేశము.

6. మానవులనేక ద్వారములు గల గృహములను యజ్ఞశాలలను యానములను నిర్మించి యట నివసించి హవనమును, గమనాగమనముల నొనర్చవలయును.

———

## -: సింహావలోకనము :-

10 సూక్తముల 102 మంత్రములకు సంపూర్ణ భాష్యమును లోగడ ప్రకటించగా ఇప్పుడు తర్వాత పది సూక్తముల 100 మంత్రములకు భావార్థము మాత్రము ప్రకటించు చున్నాను.

ఇప్పటికి 202 మంత్రములు వెలువడినవి. సూక్తములు 20, వర్గములు 39, అనువాకములు 5 కాగా అధ్యాయము రెండవది ప్రారంభమైనది. ఋషి దేవతాదులు సూక్తముల ననుసరించి నిర్దేశించ బడినవి. మధుచ్ఛందుడు ఆది ఋషి. అతని కొడుకు జేత రెండవవాడు, మేధాతిథి మూడవవాడు, కణ్వమేధాతిథి మఱియొకడు, కణ్వుని సంతానమైన మేధాతిథి ఇంకొకడు, వీ రెప్పటివారో చెప్పలేము. కాని వీరు మంత్రార్థ ద్రష్టలేగాని మంత్రకర్తలు మాత్రము కారు.

ఇందు ఏకదేవత, జంటదేవతలు, మరుత్తులు, ఋభువులు మొదలైన బహువచన దేవతలు నున్నారు. ద్విపద ద్వంద్వము, బహుపద ద్వంద్వమునందును దేవతలు చెప్పబడి యున్నారు. వేద శబ్దములు, దేవతలు యౌగికశబ్దములు. రూఢినామములుగావు. అగ్ని శబ్దము త్రివిధాగ్నులను సూర్య విద్యుద్భౌతికాగ్నులను తెలుపగలదు. ఇంద్రశబ్దమటులనే రాజునకు, ఐశ్వర్యవంతునకు, సూర్యునకు, విద్వాంసునకు, పర్యాయ వాచకము కాగలదు. ఆశ్విని శబ్దము ద్వివచనము. అది జంటగానున్న అధ్యాపకోపదేశకులను, తల్లిదండ్రులను, అగ్ని వాయువులను, భార్యాభర్తలను ఓషధి చికిత్సకుడు, శస్త్రచికిత్సకుడు, శారీరక రోగముల వైద్యుడు, మానసిక రోగముల వైద్యుడు మొదలైన జంటలను తెలియజేయును. సాయణాది ప్రాచీనులు, వారిని యనుసరించిన విల్సను మోక్షముల్లరాది విదేశీయులు ఇంద్రమరుదాది శబ్దములకు రూఢి అర్థములనే యొనర్చి అనర్థ మొనర్చిరి. ఆయా శబ్దములకు వారొనర్చిన యర్థములను మహర్షి నిర్వచనములతో పోల్చి చూచినచో పాఠకులే యథార్థమును గ్రహించ

గలరు. మహర్షి ప్రాచీన ప్రామాణికములగు నిరుక్త బ్రాహ్మణాది వేద వ్యాఖ్యా గ్రంథముల భావమును పునరుద్ఘాటించిరి. ఆయన యోగమహిమచే సత్యార్థమునే ప్రకటించ గలిగెను.

వేదములలో వ్యక్తుల ఇతిహాస మున్నదని నిరూపించదగు సాయణాదుల భాష్యమును అవైదికమని భావించవలసి యుండును. ఒకవైపున వేదము ఈశ్వరీయజ్ఞానము నిత్యము అని స్వీకరించుచు మఱియొకవైపున ఇంద్రాదుల వ్యక్తిగత చరిత్రలున్నవి, గంగా యమునాది నదుల వర్ణన యున్నదని భాష్యమొనరించుట స్వవచన వ్యాఘాతమే యగును. ఏలయన సృష్ట్యాదిలోనే మానవులకు ప్రసాదించబడిన ఈశ్వరీయజ్ఞానమందు తర్వాత ఎప్పుడో జనించిన వసిష్ఠ విశ్వామిత్రాజీగర్త యదు పురూరవేంద్ర బలాసుర రంభోర్వశ్యాదుల ప్రసంగ మెటనుండి రాగలదు? ఈశ్వరుడు నిత్యుడు. అతని జ్ఞానము కూడ నిత్యమే. అందు వ్యక్తుల చరిత్రలుగాని నదీపత్తనముల నామములుగాని పేర్కొనబడుటకు అవకాశ మెక్కడిది? వేదములలోని శబ్దములను గ్రహించి మానవులు పేరులు పెట్టుకొనిరని చరిత్ర చెప్పుచున్నది, నేడును వ్యవహారము అటులనే జరుగుచున్నది. వారివారిధర్మ పుస్తకములందును ఇతిహాసములందును వాడబడినశబ్దములలో నచ్చినశబ్దములను గ్రహించి పేరుపెట్టుకొనుటలేదా?

సాయణాదులీ సూక్ష్మ విషయమును పాటించజాలక పోయిరి. ఇంద్రుడన దేవతల రాజు, స్వర్గాధిపతి యనియు, తపస్సు యజ్ఞము చేసికొను వారలకు విఘ్నము కలిగించు దుష్టనాతియనియు, అహల్యాజారుడై వంటినిండా యోనులనే సంపాదించుకొన్న స్త్రీలోలుడనియు, జరామరణములు లేకుండ నిత్యము సురాపాన మొనరించుచు రంభాద్యుత్తమ సుందర సుదతీ మణులతో కన్నైనా మూయకుండ, మంచము దిగి నేలమీద కాలైనా మోపకుండ రమించుచునేయుండు దేవతలకు రాజు అనియు, రాక్షసులచే సదా భయభీతులై మర్త్యులను సహాయార్థ మర్థించు

వీరులకు అధిపతి యనియు భావించి వారల ప్రసంగములను వేదములో చూపించుటకు సాహసించిన వారిని వేదభక్తులు, పరాత్పరుని పరిచారకులని ఎటుల భావించవలయును ?

ఒకప్పుడు సమాధిస్థులై ఒక్కొక్క మంత్రమునందలి విషయ మును భగవంతుని ద్వారా అంతరాత్మయందు గ్రహించి సంఘమునందు ప్రచార మొనర్చి మంత్రద్రష్టలుగ ప్రసిద్ధికెక్కిన ఋషులెక్కడ ? ఏ యోగసిద్ధిలేకుండ భగవద్భక్తితో పనిలేకుండ మానవుల భాషకుచెందని వేద ముల కర్థము వ్రాయుటకు యూరోపీయుల కెట్టి యాధారము ఎక్కడినుండి లభించవచ్చునని భావించాలి ? వారును వారికి పూర్వము సాయణాదులచే రచించబడియున్న శబ్దార్థములను గ్రహించి అర్థము వ్రాయుటకే పూను కొనిరి. ఇటుల కానని వాని నూతగొని కానని భంగియే యైనది గదా ?

ఇట్టి తరుణములో మహర్షి అవతరించాడు. ఆయన ప్రగాఢమైన ఈశ్వరభక్తిగలవాడు. పరంపరగా వచ్చుచున్న ఋషుల పరమజ్ఞానము పొందినవాడు, సమాధిసిద్ధ యోగిపుంగవుడునై దీర్ఘకాలమునుండి వేదార్థ మొనరించుటలో, జరిగిన అపచారముల నన్నిటిని గ్రహించి ఆ పాప పంకిలము నంతటిని ప్రక్షాలన మొనర్చుటకు నడుముకట్టి ఆత్మార్పణ మొనర్చుటకు సంసిద్ధపడిన మహాపురుషుడు. అట్టి దివ్య దయానందుని దివ్యదృష్టిని గోచరింపజేయు వేదభాష్యమును చదువగోరని జిజ్ఞాసు వెవ డుండును ? కాని ఆయన స్మారక చిహ్నమనియు, వేద ప్రచారమే ముఖ్యాశయముగ గలదనియు భావించబడు ఆర్య సమాజమునకు అధికారు లైనవారికి ఏమాత్రము వేదములందు వేదాజ్ఞలను పాలించుటయందు శ్రద్ధా భక్తులు కానరాకున్నవి. వారు తమ యీ శూద్రత్వమున కెన్నడు పరిత పించెదరో కదా !

ఇట్టి స్థితిలో నే నెంతవరకు ఎదురీదగలుగుదునో, భగవంతుని యనుగ్రహ మెంతవరకు ఈ కార్యసిద్ధికై పొందగలనో, ఊహించజాల